స్నేహలతా కవితాసంఘ పుష్పము

శ్రీమత్పరదేవతాయైనమః.

# కవితాకాంతావిహారము.



[ప్రథమాశ్వాసము.]

గ్రంథకర్త:

కవిజనారాధ్య

వాజపేయయాజుల రామసుబ్బారాయుఁడు,

హెడ్మాష్టర్,

శ్రీ లక్ష్మీరాయ మిడిల్ స్కూలు

అండ్

ప్రెసిడెంటు

స్నేహలతాకవితాసంఘము

కొల్లాపురం,

శ్రీ జటప్రోలు సంస్థానము

శ్రీవైష్ణవ ముద్రాక్షరశాల, పెంటపాడు.

1934.

శ్రీమహేశ్వరదేవతాయైనమః.

# తొలిపలుకు.

పాఠకమహాశయులార !

ప్రతిజీవికిని నిద్రయనునది ముఖ్యము. జీవకోటిపైకి మానవులు విజ్ఞానధనులగుటం జేసి యారోగ్యశాస్త్ర మనుసరించి నిద్ర ప్రధానముగఁ బరిగణింపఁబడుచున్నను ధర్మ మతిక్రమింపక నీటిబుగ్గలవలె నస్థిరమైన యీ ప్రాణమును విద్యుల్లతలవలె క్షణములో మాయమగు భోగభాగ్యములును శాశ్వతములని భ్రమింపక, యుదరపోషణార్థమై పగటికాలమంతయు వ్యావహారిక పరిశ్రమలయందు వ్యర్థమగుటం జేసి, మిగిలిన రాత్రిభాగమే పరమార్థసాధకంబగు దైవతారాధనకై వెచ్చింపఁబడవలసినదగుటచే నట్టి సమయమును శక్తికొలఁది భక్తిమార్గమున వినియోగించుట సర్వవిధముల శ్రేయోదాయకమని నాయభిప్రాయము. రాత్రిభాగము నిశ్శబ్దముగ నుండుటం జేసి కవుల కత్యంతప్రియముగనుండును. జ్ఞాను లిట్టియవకాశమును వృథఁబుచ్చరు.

ఈ చిన్నిగ్రంథము రాత్రిభాగమున నుత్పత్తి యైనదనియు మహావేశసంభరితాత్ముండనై సరస్వతీసేవకన్న మిన్నయగు ధర్మము మానవులకు లేదని నిరూపించుచు నాశువుగ వ్రాయఁబడినదనియు నా యీవిషయము లన్నియుఁ గవితారసాస్వాదనిపుణు లెఱింగినవే గనుక విస్తరింపక యింతటితో విరమించుచున్నాఁడను.

శా. ప్రారంభించినదాది నాశుకవితా ప్రావీణ్య మేపారఁగా
నౌరాయంచు నుతించుచందము ననాయాసంబుగా నిద్దశృం
గారప్రక్రియఁ జెప్పు బుద్ధిగరిమన్ గల్పించినా విట్టులే
కారుణ్యంబున నన్నుఁ బ్రోవు మెపుడున్ గాని! పరాదేవతా!

ఇట్లు, బుధజనవిధేయుఁడు,

రామసుబ్బారాయఁడు, బి. ఏ.,

శ్రీమత్పరదేవతాయైనమః.

# ఆశీర్వాదము.

శా. శ్రీమత్కొల్లపురంపు రాజ్యరమవా । సిన్ మీరఁ బాలింపుచున్
శ్రీమంతంబగు కీర్తికిన్ నెలవునై । చెల్వొందు రత్నాంబ స
త్ప్రేమానూనకటాక్ష వీక్షణరుచుల్ । దీపింప నన్ బ్రోచు వి
ద్యామాన్యుండనటంచు శేషగిరిరా । యా! లోకులే దెందునన్. 1

శా. శ్రీరాజ్ఞీమణి రత్నమాంబిక కృపన్ । జెన్నారు కొల్లాపుర
శ్రీరాజ్యంబున నున్నవారనుగుటన్ । స్నేహంబుదై వార నెం
తో రాజిల్లెడు భక్తిభావములు నీ । కొప్పారె నా పట్టునన్
బ్రారంభంబులు వృద్ధిఁ జెందెనె ధరన్ । మైత్రీప్రభావోన్నతిన్. 2

ఉ. తాతయుఁ దండ్రియున్ జనని । దారినిఁ బట్టి మహోదయమ్మునన్
ఖ్యాతిగడించు సత్కృతు ల । నంతముగాఁ బొనరించుచుండుటల్
నీతికి లక్షణంబనుచు । నీవటు సజ్జనమార్గవర్తివై
భూతలమందు మించఁగల । భూరియశమ్మును నిల్పినావహో. 3

క. శివతారావళిలోనన్
గవితామాధురునిఁ గోరి । గౌరవ మొప్పన్
గవిలోకము నుతియింపఁగ
భువి వెలయన్ జేసినట్టి । పుణ్యుఁడ వీవే. 4

ఉ. శ్రీయుత తాంధ్రవంశమున । సిద్ధచరిత్రుఁడవై జనించి వా
లాయముగా కవిప్రవరు । లన్ దగురీతిని నాదరించి తే

బ్రాయమునందె శేషగిరి । రాయ ! యశంబునుగన్న నీకు దీ
ర్ఘాయువుఁగూర్చి ప్రోచునెపు । డాగిరిజాపతి సత్కృపోన్నతిన్.5

మ. ఘనమౌ కావ్యమటంచు నెంచి 'కవితా । కాంతావిహారంబు' ప్రే
మనురాగమ్మునుసూపియుచ్చువడఁగన్ । యుత్నంబుఁగావించి, పెం
పునఁ గీర్తిన్ బ్రకటించినాడవు భవ । త్పుణ్యప్రభావోన్నతిన్
నినుఁగాపాడుత రామచంద్రుఁడెలమిన్ । వీక్షించి యెవ్వేళలన్.6

శా. అచ్చొత్తించితి నాదుపుస్తకము లా । హ్లాదంబు సంధిల్లఁగా
వెచ్చమ్మున్ గణియింప కెంతయునుసం । ప్రీతిన్ విలోకించుచున్
హెచ్చౌకీర్తి గడించినాడవుగదా । యిప్పట్టునన్ ధాత్రిలో
నుచ్చశ్రీలనుగాంచుమింక బుధులో । హో యంచుని న్మెచ్చఁగన్.7

చ. సుగుణములెల్ల ప్రోగుపడి । శోభిల నీవయి జన్మమందెనో ?
సుగుణములన్నియున్ వెదకి । సొంపుగ నీదగుతల్లి యుగ్గుపా
లుగ నొసరించి నీగళము । లో నిడిపించెనో ? యట్లుగాని చో
నగణిత సద్గుణంబు లహ । హా! కనుపించునె నీకుపట్టునన్. 8

మ. ధన ధాన్యాది విశేషభాగ్యతతి వి । ద్యాబుద్ధు లార్జించుచున్
జను లౌరాయని మెచ్చువైఖరిని స । చ్చారిత్రమున్ గాంచి ఖిం
చిన యౌదార్యముజూపిసత్కవుల యా । శీస్సుల్ తలన్ దాల్చుమో
యనఘా! శ్రీయుత తాంధ్ర శేషగిరిరా । యా! నీకు దీర్ఘాయువౌ.9

మంగళం.

శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీమత్పరదేవతాయైనమః.

# కవితాకాంతావిహారము.

[ఏకాశ్వాసము.]

---

శా. శ్రీవాణీ కరుణాకటాక్షకలనా ♦ క్షీరాబ్ధి నోలాడుచున్
జేవల్మీరఁ గవిత్వమల్లుచు యశః ♦ శ్రీ వృద్ధిఁగావించుచున్
దేవారాధనతత్పరుండనయి ధా ♦ త్రిన్ గాలముల్ బుచ్చు స
ద్ధ్యానంబుల్ దయసేయుమంచు నెదలో ♦ భావింతుమూర్తిత్రయిన్.

ఉ. నిద్దురవీడి సన్నిటుల ♦ నిచ్చలు రాత్రులయందు వ్రాయఁగా
వద్దని యేలకుండెదవు ♦ భామిని! బద్ధకముండు వేళ నా
పద్దెశ సంభవించునను ♦ వార్తలెఱుంగవో? నీవెఱింగియున్
దద్దయుఁ బట్టుపట్టుటలు ♦ ధర్మమె యెప్పటికేనియున్ సఖీ! 2

ఉ. ఈవిధినాకున్నె వగవ ♦ నేల దురంతవిషాదచిత్తవై
దైవము వ్రాసిపెట్టినది ♦ తప్పునె యెవ్వరికైనఁగాని న
న్నీవిధి నిద్రవీడి లిఖి ♦ యింపుమటంచు విధాతవ్రాసె నా
జీవితమిట్టులే గడచుఁ ♦ జెల్వరో! దీనికిఁ జింతయేటికిన్. 3

ఉ. నిద్దురపోవుచుండినను ♦ నిల్వదు నెమ్మనమందుఁ బ్రేమ నా
వద్దకురమ్మటంచు బల ♦ వంతముగా ననులాగుచుండు నే
నెద్దివచించినన్ వినక ♦ యిట్టులె మత్కవితాలతాంగి న
న్నొద్దిక మీరఁ జేర్చి సర ♦ సోక్తులు వ్రాయఁగఁ జేయు నెప్పుడున్. 4

ఉ. నాకొకనాఁటిరాత్రి లల ♦ నా! కనుపించి మహోదయమ్ముసన్
నాకవితాలతాంగి యొక ♦ నాఁడును మానకుమానకంచు నా
కేకవిధమ్ముసన్ నుడివె ♦ నిట్టులె జీవితముండుదాక నా
పై కృతులన్ రచింపుమని ♦ భాగ్యము దాన లభించునం చొగిన్.5

ఉ. మానక దానిపల్కులె ప్ర ♦ మాణములంచుఁ దలంచినాఁడ క
న్గోనలనాను భాష్పముల ♦ కున్ వశమౌచు సరస్వతీసతీ
మానిని యిట్లుపల్క నను ♦ మానమదేటికి మానినీమణీ
ఈనియమంబునన్ నడువ ♦ నెంచితి నాళ్లులు వెళ్లఁబుచ్చుచున్ .6

ఉ. మానుడు మానుడంచు నను ♦ మాటికి మాటికి మాటిమాటికిన్
మానిని! చెప్పనేటికి కొక ♦ నాఁటి ప్రసంగముకాదు కావునన్
మానుట నాకసంభవము ♦ మాని యొసర్చువ నేమిచెప్పుమా
మానెద హర్ష మింకొకటి ♦ మానుగ నాకెటులైనఁ జిక్కినన్.7

చ. కలదొక చిత్రగాథ తమ ♦ కంబున విస్మరహాస్యమిద్ది నే
నిల జనియించి పెద్దనయి ♦ హెచ్చుగ బుద్ధులు నేర్చినంత నా
కలవడె దైవసంగతి స ♦ మస్తముఁ జెప్పెద నీకు భార్యవై
వెలిగెడుదానవౌట ననుఁ ♦ బ్రేమఁదలిర్పఁగఁజూచుచుండుటన్.8

చ. తిరిగితి దేశదేశములు ♦ దీనికినై కడుచింతఁబూని నే
నరుగనిచోట్లు లేవు వయ ♦ సంతయు నీగతిఁజెల్లుచుండ నం
చెఱిఁగి తదేకనిష్ఠఁగొని ♦ యే జపమూనుచు సేయుచుండఁగా
పరమదయాళుఁడైన భగ ♦ వంతుఁడు దర్శనమిచ్చె నంతటన్. 9

ఉ. ఏనొనరించినట్టి జప ♦ మీవిధి సత్ఫలమౌ ఘటింగి నా
మానస మిప్పుడున్ సుకృత ♦ మార్గమునన్ జను భాగ్య మిమ్మటం
చే నపు డా మహాత్ముని భ ♦ జించితి నెక్కుడు భక్తిపెంపునన్
వాని పదారవిందముల ♦ వ్రాలుచు వందన మాచరించుచున్. 10

ఉ. అంతట లేవనెత్తి నను ♦ దంచితరీతినిఁ బుత్రువోలె స
న్నెంతయు నాదరించి భయ♦మెంతయు వీడుమటంచుఁ జెప్పి న
త్యంతసుఖంబుఁగల్గు నదు ♦ పాయము జెప్పె నొకండు నాకు ని
శ్చింతమనమ్ముతో నతఁడు♦సెప్పినదంతయు నేగ్రహించితిన్. 11

చ. మనుజునకున్ బ్రధానము స♦మంచితసౌఖ్యము దానిఁగోరఁగాఁ
బనినడ దెంతమాత్రమును ♦ భామరకోటికి దాని నెట్లొ గాం
చినమనుజుండు కష్టములఁ ♦ జెందడు పొందడు తాపమేదియున్
దినదినమున్ క్షణక్షణ మ ♦ దేపనిగా జప మూనిచేసినన్.12

చ. జపములకన్న మిన్నయగు♦సత్కృతులన్ రచియించుచుండుటల్
విపులమనంబుతోడ నర ♦ విందదళాక్షునిఁ గొల్చుచుండుటల్
గృపయును దాల్చి బీదలకు♦నెల్లపుడున్ దగుసాయమిచ్చుటల్
చపలతలేని చిత్తమున ♦ సాధుజనాళికి మ్రొక్కుచుండుటల్.13

ఉ. ఈ పరమార్థతత్త్వగుణ ♦ మెంచుక నేవినినంతనంతలోఁ
బాపము తొల్గఁబోనని ♦ భావమునం దలపోసినాఁడ నే
నోపికతోఁ బదార్థమును ♦ నూరక నామనసార నెంచుచున్
దాపను లేగుమార్గమును♦నద్దయుఁబట్టఁగ నిశ్చయించితిన్. 14

చ. వ్రతములపొంతఁబోక నుప♦వాసపరాఙ్ముఖుఁడై మెలంగుచున్
సతతము దీర్ఘసేవయును♦సంధ్యలువార్చుటయున్ ద్యజించుచున్
మితముగ మాటలాడుచు న♦మేయగుణాఢ్యులకెల్ల మ్రొక్కుచున్
కృతులను వ్రాయుచున్ గడప♦నెంచితి జీవిత మిట్టులో సఖీ! 15

ఉ. అప్పటినుండి నేటివర ♦ కాపరమాత్ముని ధ్యాన నించుకన్
దప్పక సత్తపంబులను ♦ దానము ధర్మము లెన్నియేనియున్
మెప్పుగడించుపద్ధతు ల ♦ మేయముగాఁగ నొనర్చుచుంటి నో
యొప్పులకుప్ప! దేహబల♦ మార్చుకొలందిని సేవఁజేయుచున్.16

శా. ఈరీతిన్ బ్రతివాసరంబు నెదనెం ♦ తేనిన్ మహోత్సాహమే
పారంగాఁ గడుభక్తిఁదాల్చి వరదున్ ♦ ధ్యానింపఁగా సత్కృప
శ్రీ రంజిల్లఁగఁజేసి దర్శనము ని ♦ చ్చెన్ నాకు దివ్యాకృతిన్
బ్రారంభించితి స్తోత్రపాఠములు స ♦ ల్లాసంపద్విధంబునన్. 17

గీ. అంత నాభక్తి కెంతేని ♦ నంతరంగ
మందు మెచ్చికొనుచు నంక ♦ మందుఁ జేర్చి
వరమొకండు నాకిచ్చెఁ ద ♦ ద్భాగ్యమహిమ
నంత నజ్ఞానలీలలు ♦ నంతరించె. 18

మ. కలలోఁ గాంచినరీతి నెంచితిని త ♦ ద్గాథావినోదంబు తే
నిలజన్మించినదాది నింతవరకౌ ♦ క్లిష్టాప్తిఁ జేకూరఁగా లే
దల పుణ్యంబున లభ్యమయ్యె ననుచున్ ♦ స్వాంతమ్మునం దెంచితిన్
విలసత్ప్రజ్ఞనుగాంచు పుణ్యమొ యనన్ ♦ నిండారు సౌఖ్యంబునన్. 19

ఉ. ఆవరమెట్టిదంచు మన ♦ మందున శంక జనించు నేమొ నీ
కో వనితామణీ! వినుము ♦ నోపికఁ బట్టి వచింతు నిష్ట సౌ
ఖ్యావహమైన జీవితము ♦ సంతుష్టిఁ గవితాలతాంగికిన్
సేవ లొనర్పఁగావలయు ♦ నేనటులే యొనరింపఁబూనితిన్. 20

చ. ననువరియించె నంతట ఘ ♦ నమ్ముగు వేడుక మీఱఁగా ముద
మ్మున ననుఁబోలరం చెవరు ♦ పొందుగ నేనటులే వరించితిన్
మనసిజతాపభారమున ♦ మ్రగ్గుచుఁ దాళఁగలేక యాపయిన్
గనఁబడె సౌఖ్యసంపదలు ♦ కాంతరో! వేఱుగఁ జెప్ప నేటికిన్. 21

మ. కవితాకాంతయు నేనునున్ గలసి వే♦డ్కల్ పిచ్చలింపంగఁ ద
త్కవితాలీలలఁ దేలుచున్ మునుఁగుచున్ ♦ గాఢానురాగమ్మునన్
నవకాంతిన్ వెదఁజల్లు పుష్పలతికన్ ♦ నానాప్రకారమ్ములన్
భువిసంచారము సేయుచుంటి మెటులో ♦ మోక్షంబపేక్షించుచున్.

చ. సవతి తటస్థమాయెనని ♦ చానరో! కోపము జూపఁబోకు మా
కవియుట మానఁబోకు తమ ♦ కంబునఁ దీరికఁగల్గువేళలం
దవిరళప్రేమ నీవయిని ♦ హాయిగఁజూపవఁ గాని ప్రేయసీ
కవనము వ్రాయువేళఁ బోడ♦గట్టదుసుమ్మి భవత్స్వరూపముల్.23

చ. నినువరియించి వేఱొకతె ♦ నేనెటులన్ వరియించితంచు నె
మ్మనమునఁగోప మూనకుము♦భామిని చెప్పెద నొక్క-వాక్యముల్
వినుము విశుద్ధచిత్తమున ♦ నిన్ను వరింపకమున్నె దానిపై
మనసును బెట్టినాఁడఁ బ్రథ♦మంబున నాపయి నిన్నుఁగోరితిన్.24

ఉ. నాకొక నాతియున్నదని ♦ నాతిరో! వేఱుగఁ జెప్పనేటికో
లోకమెఱుంగు నంతయును♦లోల విశాల మృగాయతాక్షిరో!
నాకథ నీవెఱింగియు మ ♦ నమ్మున నన్ను వరించుటేల? ఆ
[illegible] కినుకన్ వహించుటది♦భావ్యమె లోకమునిన్ను మెచ్చునే?25

ఉ. నీకిపుడేది లోటు ధర ♦ నిన్ గలచిత్రము లన్ని చూపితిన్
గాక మఱెట్టికష్టములు ♦ గల్గఁగనీయ కనేకరీతులన్
జేకొని ప్రేమభావమున ♦ నిన్నెడఁ జేర్చితిఁ గౌఁగిలించితిన్
నాకవితాలతాంగివలె ♦ సన్మతి నిన్నును నెమ్మనమ్మునన్. 26

ఉ. కాని యొకింతభేద మటు ♦ గన్పడు నన్న యదార్థవాక్యమా
దానికి నేమిసేతు గుణ ♦ ధర్మముబట్టి వచింపఁగాఁబడెన్
దీనికి నెమ్మనమ్మున స ♦ తీ! విలపింపఁగనేల? కైతలో
దానికి నేర్పుఁగల్గ నిను ♦ దాటఁగ వాదము పెంచనేటికిన్.27

ఉ. అయ్యది కారణంబు మన ♦ మర్పణఁజేయఁగ దాని కంతగాఁ
గయ్యమెఱుంగ దెప్డు నొక ♦ కాలమునందును గష్టపెట్టదే
దెయ్యదనైన నన్ను వరి ♦ యించినదాది వినోదలీలలన్
నెయ్యముదియ్యముల్ సలిపి♦నేర్పునఁగీర్తిఁగడించె ధాత్రిలోన్.28

ఉ. నీవును దానివోలె నవ ♦ నీత సమానమనంబుతోడ స
ద్భావముదాల్చి కైతమును ♦ వ్రాసి రసజ్ఞులు మెచ్చురీతిగాం
బై వివరించినట్లు నడు ♦ వన్ దలపెట్టుమ నీపయిన్ బ్రియ
శ్రీవిలసిల్లజేయుదుం బ♦రిస్ఫుటభంగిం బ్రసూనకృలాఘుచున్.29

ఉ. ఏదినమందు నన్ను వరి ♦ యించెనో మత్కవితాలతాంగి నా
పై దయనాటి పాయుటకు ♦ భావమునం దెప్పుడైన నోర్వంగాం
బోదు క్షణంబునైన నల ♦ పొందిక చూతుమటన్నం జెప్పంగా
రాదు విలాసభోగముల ♦ రాజిలంజేయు మనోహరాంగనుగన్ . 30

మ. పనిమీదన్ బొరుగూరి కేగునెడ స ♦ త్ప్రాప్తిన్యమేపారంగా
వెనువెంటన్ వలదన్న మాన దెప్పుడున్ ♦ నెంటాడంగా నన్ను నే
మనినన్ మారు వచింప దెప్డు సుగుణా♦వ్యక్తిన్ విరాజిల్లు నె
మ్మనమా మెత్తనదానిం బోల నెవరున్ ♦ భామామనోరత్నమా!

ఉ. నీవటులెప్పుడైనను గ ♦ ణించితె నన్నటు వెంబడింపంగా
భావము నాపయిన్ నిలిపి♦భామరో సత్యము చెప్పు మొంటిగా
నావిధి యిట్టులుండెనని ♦ నన్నెద నిందనచేసికొం చటో
పోవంగనెంచుచుంటి వల♦పున్ దలపున్ బచరింపంజేయుచున్ .32

ఉ. తానటు తోడునీడవలెం ♦ దగ్గయు ధర్మనిబద్ధచిత్తయై
మానక వచ్చి యాపయిని ♦ మానసమందున డాగి బద్ధకం
బూనినవేళ మైమఱచి ♦ యుండెడివేళ సదానురక్తయై
మే నటుతట్టుం దట్టంగనె♦మేల్కొనుచున్ సరసోక్తులాడంగన్. 33

చ. కలమటు పూనినంత వడి ♦ గా లిఖియించెను మేటిశక్తి నా
కలవడునంతలోన మన ♦ మందున బద్ధకమూడిపోవు ని
ర్మలమగు చిత్త మేర్పడు స♦మస్తము జక్కంగం గానుపించెడిన్
సలలితధారయా యనెడు♦చందమునన్ రచియింతుం బద్యముల్.

గీ. నాఁడుమొదలు నేఁటివఱకు ♦ నాడునైన
బద్ధకం బనుమాట నా ♦ నగ్గలేదు
ఎట్టి శుభముహూర్తమున వ ♦ రించెనొక్కొ ?
సకలసద్గుణసాంద్ర నా ♦ చంద్రవదన. 35

ఉ. దానివిలాసవైభవము ♦ దానిమనోహరరూపకాంతియుఁ
దానిప్రసన్నదృష్టియును ♦ దానిచమత్కృతియుఁ బ్రభావముఁ
దానివిశాలనేత్రములు ♦ దానియొయ్యారము దానిఠీవియుఁ
దానిమిటారిపల్కులును ♦ ధాతకునైన వచింపశక్యమే ? 36

ఉ. దానికి నీకు సాటికల ♦ దా? యొకనైనను జెప్పుదన్న నె
ద్దానికిగాను నీవిటుల ♦ దర్పము బూనుచు మాటిమాటికో
మానిని! స్తోత్రపాఠములు ♦ మానవు మానుము మానుమన్న నెం
తేనియు నానలేక వచి ♦ యించెద వేటికి? చక్కమాటలన్. 37

ఉ. ఏటికిఁ బిచ్చియంచు నను ♦ నెల్లప్పుడుఁ గడునింద సేయఁగా
నేటికి నాలతాంగిపయి ♦ నేలవహింతువు కిన్క దానితో
మాటలు సెప్పఁగాఁదగు న ♦ మర్థతయున్నదె నీకు జెప్పుమో
బోటి వృథాప్రసంగములఁ ♦ బుచ్చెద వేటికిఁ గాలమింగతిన్. 38

శా. పావంపున్ననుడులేల యీ సతిని జేఁ ♦ బట్టంగఁ గల్యాణముల్
ప్రాపింపన్ శుభముల్ ఘటించె ధన మా ♦ పాదింపఁగా నయ్యోని
ష్పాపుంగా నొనరించె సత్కృతులు స ♦ ల్పన్ జేసి సౌఖ్యంబు నా
కేపారెన్ మనమందు శాంతిఁగొని తెం ♦ తేనిన్ సఖీరత్నమా! 39

మ. కవితారాజ్యము చేతికిచ్చె మిగులన్ ♦ గారుణ్యముం బూని దా
ని వినోదంబులు సెప్పఁగాఁదరమె నా ♦ జీవితేశుంబచ్చె దా
నివరింపంగ నికేమికావలయునో ♦ నీరేజపత్రేక్షణా !
వివరింపన్ బనిలేదు దేనికయినన్ ♦ విజ్ఞానతా వారికిన్. 40

ఉ. అంతట చక్రవర్తినయి ♦ హాయిగ భోగము భాగ్యమెల్ల న
త్యంతముపొందుచున్ సుఖము♦నందుచుమెత్తని పుష్పశయ్యలన్
వింతగునందనంబులను ♦ నిండగుచందన చారుచర్చలం
దెంతయునాసతిన్ గలసి♦స్వేచ్ఛగనాళ్లులు బుచ్చుచుంటొగిన్. 41

చ. పిలిచినయంతలోనఁ గడుఁ ♦ బ్రేముడిఁజూపుచు వచ్చి నాదెసన్
నిలచి మనోహరాకృతిని ♦ నీటుగఁ జూపుచుఁ బ్రాణనాథ! నన్
బిలచిన కార్యమేమనుచు♦నెయ్యము దియ్యము నెంతయేనియున్
జిలుకుచుఁ జిల్కపల్కులను♦ జెప్పెడి చెల్వను గుండెఁగాఁ గనున్. 42

చ. మఱియొకనాఁటిరాత్రి క్షణ♦మాత్రము గన్నులుమూసినంత నా
కరమునుబట్టి లేపి యిటు ♦ గాఢతమంబగు నిద్రఁ జెందఁగాఁ
గరము విషాదమయ్యెనని ♦ గాసిలిఁ జెంద నేమి చెప్పుదున్
మఱువఁదలంచినన్ మఱువ♦నాతరమా క్షణకాలమేనియున్. 43

ఉ. నీకును దానికిన్ గలదు ♦ నీరజగంధి! యొకింత భేదమున్
నీకెఱిఁగింతు విన్ముతన ♦ నే స్మరియింపఁగఁ జేయు నెప్పుడున్
నీకటువంటిమూర్ఖత గ ♦ ణించినఁ గన్పడఁబోదు కాన చీ
కాకును జెందలే దెపుడు ♦ కాంతరొ! నీకిది గొప్పయేకదా! 44

చ. తనపనికన్న వేఱొకటి ♦ తప్పుగఁ జూచు సహింప దెప్పుడున్
బనిఁగొని చేసితేని కను ♦ పట్టును గన్నులఁ గట్టినట్లు; ఎం
తని బ్రతిమాలువాఁడఁ గుల♦ధర్మము దప్పని సాధ్వి యాటచేఁ
దనవశమైతి నెల్లపుడు ♦ దానికి దాన సుఖంబు గల్గుటన్. 45

ఉ. స్నానము సంధ్యయున్ వదలి ♦ నాడను నిద్రయు మానివేసితిన్
మానితి సర్వకార్యములు ♦ మానినిఁ గూడినదాది నీవయిన్
మానితిఁ బ్రేమనుంచుటను ♦ మస్తసుఖంబులు ధారవోసితిన్
దానికిఁ గాన్కగా సఖియ!♦నాకును నీకును వాదమేటికిన్. 46

గీ. అగ్నిసాక్షిగ నిన్నుఁ బెం ♦ డ్లాడుకతన
విడువరాదింక నిన్నెప్డు ♦ వినతశీల
కోరఁదగరానిక సౌఖ్యంబుఁ ♦ గూర్చుచుందు
నగవనేటికి నీవింక ♦ వనితమిన్న. 47

ఉ. నిన్నువరించినంత తరు ♦ ణీ! గృహకృత్యములన్ని శ్రద్ధతో
నెన్నఁడు బద్ధగించక న ♦ హించుటఁ జేసి యశంబునిల్పె; భా
గ్యోన్నతిఁ గాంచఁగల్గితిఁ బ్రి ♦ యోక్తులనొప్పెడు లక్ష్మివోలె సౌ
భాగ్యోన్నతిఁ గూడఁగాంచితి య ♦ థోచితరీతిని నైహికేచ్ఛలన్. 48

మ. ఒకచో బంధులనాదరించు టిటులం ♦ జూపింతువేమో సఖీ!
యకలంకంబగు చిత్తవృత్తి నిపుడా ♦ యాచార వృత్తంబులన్
బ్రకటింపన్ బనిలేదుగాని గృహమ ♦ ర్యాదల్ విలోకించుచో
సకలంబున్ భవదీయవృత్తిపయినన్ ♦ సాంతమ్ముగా నిల్చెడిన్. 49

ఉ. అందుకుగాను నిన్ను మన ♦ మందున నిల్పితిఁ [illegible]భార్యగా
డెందమునందు నీవయి గ ♦ డింది ప్రియమ్మును దాల్చినాఁడ నా
నందముతోడ నిన్ను సద ♦ నంబున నిల్పితి నాలతాంగితోఁ
బొందిక మీర ననుఁగనుచుఁ బ్ర ♦ మోదముగూర్పుము సౌఖ్యమేర్పడన్.

ఉ. మానక మీరిటుల్ కలహ ♦ మాడినవేళఁ బ్రశాంతముందు నే
మానసమందు నాకు లవ ♦ మాత్రమునైనఁ దదేకనిష్ఠతో
దేనినిఁగాని చేయుటకు ♦ దీరదుగావున మీర లిద్దఱున్
జ్ఞానగుణాఢ్యలౌచు నొక ♦ కాలమునైనను బాయఁబోకుఁడీ. 51

చ. నినువిడనాడినట్లు నను ♦ నీవును వీడెదవంచెఱింగి నీ
కనుగుణమైన కైతమును ♦ నంతగఁ జెప్పఁగలేదు చెప్పినన్
బనులను గట్టిపెట్టుదువు ♦ నావలె నంతట నట్టి కార్య సా
ధనము లభించఁబోదు వని ♦ తా! గృహధర్మము లాచరింపుమా.

గీ. భార్య లేకున్న సంతాన ♦ భాగ్య మెద్ది ?
సంతతిఁగనలేని నరుని ♦ జన్మమేల ?
కవనమెఱుఁగని వానికే ♦ ఘనతవచ్చుఁ
గాన ముఖ్యంబు లీ మూఁడు ♦ గాంత నాకు. 53

గీ. ఆ సరస్వతీకృపఁ గల్గి ♦ నంతఁ గల్గెఁ
గవిజనారాధ్య బిరుద మై ♦ భవము నాకు
నరయ శిష్యుల నిల్పితి ♦ నచ్చటచటఁ
గీర్తిఁ బ్రకటింపఁగా నెంచి ♦ కీరవాణి ! 54

చ. నిలిపితి నాంధ్రదేశమున ♦ నేర్పలరారెడు శిష్యసంతతిన్
జెలఁగితి దేశదేశముల ♦ సిద్ధయశంబును గాంచి సంతసయుక్
గొలిచితి లక్ష్మరాయ నృప ♦ కుంజరునిన్ గవితాంగితాంగితో
వెలసితి రాట్సభన్ గవిత ♦ విశ్రుతికెక్కని కేమికావలెన్. 55

ఉ. కొల్లపురంబునందున స ♦ కుంఠితభక్తిని వెల్లడించి నే
నల్లన పెద్దవార లహా ♦ హా! యని మెచ్చఁగ సంఘముఁ జొగిన్
మెల్లనఁ గూర్చినాఁడఁ దరు ♦ ణీ! కవితాసతి ప్రోత్సహింపఁగా
నెల్లవిధమ్ములన్ గణన ♦ కెక్కిన మిత్రులు నాదరింపఁగన్. 56

ఉ. దానిబలంబుచేతనె గ ♦ దా యొకసంఘముఁబెంచుఁ గూర్చి య
ద్దాన జయంబుఁ గాంచితిమి ♦ తద్దయుసత్కృతు లెన్నియేనియున్
మానక జేయుచుంటి మన ♦ మానబలంబును బాటి యుండుచే
దానికి నాంధ్రలోకమునఁ ♦ దక్కువగాని యశంబు నిచ్చెడిన్. 57

ఉ. ఈ వొక సభ్యురాలవయి ♦ యీవిషయంబు నెఱుంగకుంటివే
యేవిషయంబుఁగూర్చి లిఖి ♦ యింతుమొయయ్యది యప్పుడప్పుడే
శ్రీవిలసిల్లఁ బత్రికలఁ ♦ జేరుట లేదె ? నృపాలచంద్రు లా
హా! వినియుండలేదనారె ♦ యట్టి యపూర్వ విచిత్రసంగతుల్. 58

శా. ప్రారంభించినదాది విఘ్నమెపుడున్ ♦ రానీక పోషింపఁగా
శ్రీరాజ్ఞీమణి రత్నమాంబసతియున్ ♦ జేయూతనిచ్చెన్ గదా
శ్రీరమ్యంబగు "వైజయంతి" విభవ ♦ శ్రీకాంతిఁ జేకూర్చి వి
స్తారామోదము నింపదేమనను కాం♦తా! యేటికీవాదముల్.59

ఉ. ఈ విషయంబునంతయును ♦ నించుకగాని కొఱంతలేక స
ద్భావముతోడ నన్ను గురు ♦ వర్యునిగా భజియించుచుండు శి
ష్యావళికిన్ వచించితి స ♦ మంచితబుద్ధి గ్రహించె నంతయున్
దావిని నా "సరస్వతి" ము♦దమ్మున నీపరమార్థతత్త్వమున్.60

నాయుపదేశవాక్యము ల ♦ నారతమున్ స్మరియించి పేర్మితో
నాయడుగుల్ భజించి యొక♦నాఁడును మానక భక్తిభావముల్
నాయెడ దైవసంగతి గను ♦ నమ్మఁగనిల్పు సరస్వతీసతిన్
శ్రీయును వాణియున్ గలసి♦ చెల్వుగఁ జూతురుగాక నిచ్చలున్.61

ఉ. నేనును నా "సరస్వతి" యు ♦ నేర్పున జీవితముండుదాక యి
ట్లీనియమంబుఁ బూని లిఖి♦యింతుము రాత్రులయందునిద్రయున్
మాని విచారమేటికిఁక ♦ మానిని! సత్కవితాలతాంగి మా
పై నెనరూని లోటుగను♦ పట్టదు మాకొకయించుకేనియున్.62

శా. కాంతా! యింతసుఖంబునిచ్చెఁ గవితా♦కాంతావిహారంబు నే
నెంతోఁ గష్టమొనర్చి కాంచితి నిటే ♦ యేడేండ్లు పాలించితిన్
బంతంబున్ వహియించి మానుమనుచున్ ♦ మాట్లాడఁగాఁ జెల్లునే!
జింతింపన్ వలదింక దీనికొఱకై ♦ జీకాకులన్ జెందుచున్. 63

చ. తుదిపలుకున్ వచింతునిఁక ♦ తొయ్యలి! శ్రద్ధనుబూని విన్మ నీ
కిది శుభముల్ ఘటించు నిది ♦ యొక్కడుభక్తిని విన్నవారికిన్
జదివినవారికిన్ గలుగు♦ సౌఖ్యము మోక్షము నిందు నందునన్
విదితముగాఁగఁ జెప్పితిని ♦ నీకకు దీనిఁ బఠించుచుండుటల్.64

# ఆ శ్వా సాం త ము.

చ. అరనిముసంబులోఁ జెడెడు ♦ నట్టి శరీరము నమ్మి సర్వముం
స్థిరమని యెంచి మూర్ఖతను ♦ జేసితిఁ జేయఁగరాని కార్యముల్
దురితము గట్టుకొంటినని ♦ దూపిలుచుంటి నమోమహేశ్వరా
కరుణఁదలిర్ప నన్ను నికఁ ♦ గాతువొ ద్రోతువొ యేమి సేతువో! 1

చ. కొడుకులు నాప్తబంధువులు ♦ గూర్మి నొసంగఁ జనునట్టి భార్యయుం
విడువరు భాగ్యసంపదలు ♦ పెంపుగ నుండెడు వేళలందు; ఎ
ప్పుడయినఁ గాలువంగు తఱి ♦ మోమటు త్రిప్పఁగఁ జూతు రందుచే
విడిచెద నట్టిలోకమును ♦ వీడను నీపదపద్మ మీశ్వరా! 2

చ. కదలఁగనీక నన్నెపుడు ♦ గామము చుట్టుకొనంగ నాపయిం
మెదలఁగనీక క్రోధమును ♦ మిక్కుటమౌ గతి బాధపెట్ట నే
కుదురును లేక సంసరణ ♦ కూపమునంబడి మగ్గుచుంటి నిం
వదలక గొల్చుచుంటి బరు ♦ వా? నను బ్రోవను మామహేశ్వరా! 3

చ. పరుల ధనంబుఁ గోరఁ బర ♦ భామల కాసనిగుడ్పఁ గ్రూరమౌ
దురితము లాచరింప మఱి ♦ దుర్జనమైత్రిని సేయఁ గండ నా
వరమునఁ గన్నగాసక న ♦ పద్యలు సేయుట మాన నేలొకో
కరుణ యొకింతరాదు కలి ♦ కాలమహత్వమొ నాదు కర్మమో! 4

—♦ గ ద్య ము. ♦—

ఇది శ్రీమత్పరదేవతా కరుణాకటాక్షలబ్ధ కవితావిచిత్ర వాజ
పేయయాజకులపవిత్ర రామనాథపుత్ర కవిజనారాధ్య
బిరుదగేయ సుజనవిధేయ రామసుబ్బరాయ
ప్రణీతంబైన కవితాకాంతావిహారంబను
దేకాశ్వాసము సర్వము
సంపూర్ణము.

ఓం తత్సత్.

# స్నేహలతా కవితాసంఘమువారిచే ప్రకటింపఁబడిన గ్రంథములు.

---

| | | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| 1 | రాఘవశతకము | ... | 0 | 2 | 0 |
| 2 | మాధవశతకము | ... | 0 | 2 | 0 |
| 3 | ధ్రువచరిత్ర | ... | 0 | 4 | 0 |
| 4 | సరస్వతీశతకము | ... | 0 | 2 | 0 |
| 5 | సరస్వతీ రామాయణము | ... | 1 | 0 | 0 |
| 6 | పతివ్రతాశతకము | ... | 0 | 4 | 0 |
| 7 | భారతనీతులు (Approved.) | ... | 0 | 4 | 0 |
| 8 | పోతన్నభక్తివైరాగ్యములు | ... | 0 | 2 | 0 |
| 9 | వైజయంతివార్షికపత్రిక | ... | 1 | 0 | 0 |
| 10 | రామాయణ సంగ్రహము | ... | 0 | 4 | 0 |
| 11 | లక్ష్మీశారదాగీతములు | ... | 0 | 10 | 0 |
| 12 | లక్ష్మీశారదాసుభాషితము | ... | 0 | 8 | 0 |
| 13 | లక్ష్మీశారదాశతకములు | ... | 0 | 5 | 0 |
| 14 | వీరగాథలు | ... | 0 | 5 | 0 |
| 15 | సుకన్య | ... | 0 | 2 | 0 |
| 16 | బ్రహ్మాపత్రోపాఖ్యానము(అను)పొగాకుచరిత్ర | . | 0 | 3 | 0 |

వలయువారికి కవితా సంఘము రిపోర్టు ఉచితముగ పంపబడును. అందు సర్వవిషయములును గోచరము లగును. పై అన్ని గ్రంథములు ఒకేసారి కొనువారికి సంఘమువారిచే రచింపఁబడిన మఱికొన్ని గ్రంథము లుచితముగ నియ్యబడును.

అడ్రసు :—ప్రెసిడెంటు : స్నేహలతా కవితా సంఘము,
కొల్లాపురం, మొరవకొండ పోస్టు,
(కర్నూలుజిల్లా.)